

**కవిశిరోమణి**

**ఆచార్య రావికంటి వసునందన్**

**జననం :** 04.05.1949

**జన్మస్థలం :** కమాన్‌పూర్, కరీంనగర్ జిల్లా, ఆంధ్రప్రదేశ్.

**తల్లిదండ్రులు :** కీ.శే. శ్రీమతి జగ్గమాంబ, శ్రీ కిష్టయ్య.

**ఉద్యోగం :** డీన్, ఆర్ట్స్ ఫ్యాకల్టీ, డా. బి.ఆర్.అంబేడ్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, హైదరాబాదు. (30.06.01 - 30.06.04)

**రచనలు :** రతీప్రద్యుమ్నము (గద్య కథాకావ్యం - 1971) వేణీ సంగమం (గేయం, పద్యం - 1975) గురుకులము (విమర్శనాత్మక గద్య కథాకావ్యం - 1978) భావదీపికలు (సాహిత్య వ్యాససంపుటి - 1980) భారతం (పద్యకథాకావ్యం - 1980) సాధన (వచన కవితా సంపుటి - 1981) బలి (గేయ కథాకావ్యం - 1981) త్రయి (మానవ మనస్తత్వ కావ్యం - 1982) భూమిక - ఒక సమగ్ర పరిశీలనం (ఎం.ఫిల్. సిద్ధాంత వ్యాసం - 1985) అష్టాక్షరి (సినారె కృతులపై సాహిత్య వ్యాసాలు - 1987) ఆధునికాంధ్ర కవిత్వంలో మానవతావాదం - 'విశ్వంభర' విలక్షణత (పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం - 1990) ప్రజావిజయం (రేడియోరూపకం - 1990) శ్రీరామ చరితామృతమ్ (పాటలు - 1992) ప్రయోజన దండకాలు (దండకాలు - 1993) కలం కదిలితే (వచన కవితాసంపుటి - 2003) లోవెలుగు (ముక్తక కావ్యం) జైగణేశ్, బాలాజీ (భక్తిపాటల ఆడియోక్యాసెట్స్ - 1994) శ్రీవేంకటేశ్వర తారావళి (పాటలు) మెరుపు మెరిస్తే (వచనకవితా సంకలనం) వానకురిస్తే (వచనకవితా సంకలనం).

**పురస్కారాలు :** ఎ.పి.ఎ. యు.యస్. సమాఖ్య కడప స్వర్ణపతక పురస్కారం (1982), డా. దేవులపల్లి కృష్ణశాస్త్రి స్మారక పురస్కారం (1982), శ్రీతేరాల జగదీశ్వర్ స్మారక పురస్కారం (1993), శిల్పా ఆర్ట్ క్రియేషన్స్ ఉత్తమ విద్యావేత్త పురస్కృతి (1993), ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉత్తమ అధ్యాపక పురస్కృతి (2002), డా. వానమామలై వరదాచార్య సాహిత్య పురస్కారం (2003), కవిశిరోమణి బిరుదప్రదానం (2003), డా.జె.ఆర్. ఎడ్యుకేషనల్ ట్రస్ట్ రజతోత్సవ స్వర్ణపతక, స్వర్ణకంకణపురస్కారం (2003), వానమామలై జగన్నాథాచార్య సాహిత్య పురస్కారం (2004), ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉగాది పురస్కారం (2004).

# ఎందరో మహానుభావులు









కవిశిరోమణి

ఆచార్య రావికంటి వసునందన్

# ఎందరో మహానుభావులు




కవిశిరోమణి

ఆచార్య రావికంటి వసునందన్

**Endaro Mahaanubhavulu**
by
*Kavishiromani*
**Prof. Ravikanti Vasunandan**

First Edition: **2006**



*Copies:* **1000**

*Price:* **Rs. 50/-**

*For Copies:*

1. **All Branches of Visalandhra**
2. **Praja Shakthi Book House**
   Hyderabad & its all Branches
3. **Navodaya Book House**
   Opp.Lane to Arya Samaj Mandir, Koti, Hyderabad
4. **Book Links,** Near YMCA, Narayanaguda, Hyderabad.
5. **Disha Book Centre,** Chikkadpally, Hyderabad.
6. **Prof. Ravikanti Vasunandan**
   Dr. B.R. Ambedkar Open University, Road No.46,
   Jubilee Hills, Hyderabad - 500 033.
   Cell: 9849852182

*Printed at:*

**Vipla Computer Services**
*(Designers & Multicolour Offset Printers)*
Nallakunta, Hyderabad - 500 044.
Ph. 27676910, 55348445

# అంకితం

**సహృదయ సంపన్నులకు**
**సంఘసేవా తత్పరులకు**



**మాన్యశ్రీ మీలా సత్యనారాయణగారు**
మునిసిపల్ ఛైర్మెన్
సూర్యాపేట్



**మాన్యశ్రీ అనంతుల జనార్ధన్‌గారు**
ఛైర్మెన్, సుధా కో-ఆపరేటివ్ అర్బన్ బ్యాంక్
సూర్యాపేట్

ఈ కృతిలోని ఇతివృత్తాలను
ధారావాహికంగా ప్రచురించిన

వైశ్య ప్రబోధిని

వాసవీ ప్రవంతి

వాసవీ ప్రభ

మాస పత్రికలకూ సంపాదకులకూ

**కృతజ్ఞతలు**

మనసారా ఆశీర్వదించి
ప్రచురణకు ప్రోత్సహించిన అమృతహృదయులు
సద్గురు శ్రీ కందుకూరి శివానందమూర్తి, భీమిలి గారికి

**భక్తిపూర్వక ప్రత్యేక కృతజ్ఞతలు**



# కవిశిరోమణి
# ఆచార్య రావికంటి వసునందన్

జననం : 04.05.1949
జన్మస్థలం : కమాన్‌పూర్, కరీంనగర్ జిల్లా, ఆంధ్రప్రదేశ్
తల్లిదండ్రులు : కీ.శే. శ్రీమతి జగ్గమాంబ, శ్రీ కిష్టయ్య
ఉద్యోగం : తెలుగు ప్రొఫెసర్,
డా. బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

## రచనలు

**కథా కావ్యాలు :**

రతీప్రద్యుమ్నము (గద్య కథాకావ్యం - 1971)
గురుకులము (విమర్శనాత్మక గద్య కథాకావ్యం - 1978)
భారతం (పద్య కథాకావ్యం - 1980 - డా॥ దేవులపల్లి కృష్ణశాస్త్రి స్మారకపురస్కారం పొందిన కృతి)
బలి (గేయ కథాకావ్యం - 1981)

**దీర్ఘ కావ్యాలు :**

త్రయి (1982)
మనస్సు (2004)

**గేయ కావ్యాలు:**

శ్రీరామ చరితామృతమ్ (పాటల్లో రామాయణం - 1992)
శ్రీవేంకటేశ్వర తారావళి (సంకీర్తనలు-2005)
ఎందరో మహానుభావులు (జీవిత చరిత్రలు - 2006)

**సాహితీ విమర్శ - పరిశోధన:**

భావదీపికలు (సాహిత్య వ్యాససంపుటి - 1980)
అష్టాక్షరి (సినారె కృతులపై సాహిత్య వ్యాసాలు - 1987)
భూమిక - ఒక సమగ్ర పరిశీలనం (ఎం.ఫిల్. సిద్ధాంత వ్యాసం - 1985)
ఆధునికాంధ్ర కవిత్వంలో మానవతావాదం - విశ్వంభర విలక్షణత (పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం - 1990)

**వచన కవితలు :**

సాధన (కవితా సంపుటి - 1981)
కలం కదిలితే... (కవితాసంపుటి - 2003)
మెరుపు మెరిస్తే... (కవితా సంపుటి-2004)
వాన కురిస్తే... (కవితా సంపుటి-2005)
నేల నవ్వితే... (కవితా సంపుటి-2006)

**వివిధ కృతులు :**

వేణీ సంగమం (గేయం, పద్యం - 1975)
ప్రజావిజయం (రేడియోరూపకం - 1990)
ప్రయోజన దండకాలు (దండకాలు - 1993)
జైగణేశ్, బాలాజీ (భక్తిపాటల ఆడియో క్యాసెట్స్ - 1994)
లోవెలుగు (ముక్తకాలు - 2004)

**ముద్రణలో :**

మనసు నిండితే... (కవితా సంపుటి)
సింగిణీ మొలిస్తే... (కవితా సంపుటి)
ఆచార్య వసునందన్ కీ కవితాయేఁ (కావ్య-సంగ్రహ్)
రావికన్నులు (సంక్షిప్త కవితలు)
బాలజ్యోతులు (పిల్లల కథలు)

## పురస్కారాలు

ఎ.పి.ఎ.యు.యస్. సమాఖ్య కడప స్వర్ణపతక పురస్కారం (1982)
డా. దేవులపల్లి కృష్ణశాస్త్రి స్మారక పురస్కారం (1982)
శ్రీ జమిలి నమ్మాళ్వార్ స్మారక పురస్కారం (1990)
శ్రీ తేరాల జగదీశ్వర్ స్మారక పురస్కారం (1993)
శిల్పా ఆర్ట్ క్రియేషన్స్ ఉత్తమ విద్యావేత్త పురస్కృతి (1993)
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉత్తమ అధ్యాపక పురస్కృతి (2002)
డా. వానమామలై వరదాచార్య సాహిత్య పురస్కారం (2003)
కవిశిరోమణి బిరుదప్రదానం (2003)
డా.జె.ఆర్. ఎడ్యుకేషనల్ ట్రస్ట్ రజతోత్సవ స్వర్ణపతక, స్వర్ణకంకణ పురస్కారం (2003)
వానమామలై జగన్నాథాచార్య సాహిత్య పురస్కారం (2004)
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉగాది పురస్కారం (2004)
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ధర్మనిధి పురస్కారం (2004)

# శ్రీ త్యాగరాజస్వామి

ఎందరో మహానుభావులు! త్యాగులు, యోగులు, సకలకళా పారీణులూ విలసిల్లిన ఈ పరమపావన భరతభూమిలో - శ్రీ రామనామసంకీర్తన సుధా కళానిధిగా విరాజిల్లిన మహాభక్త శిరోమణి, మహనీయ వాగ్గేయకారుడు శ్రీ త్యాగరాజస్వామి. ఆంధ్రప్రదేశ్‌లోని నేటి ప్రకాశంజిల్లా కాకర్ల గ్రామం నుండి క్రీ.శ. 1600 ప్రాంతంలో తమిళనాడులోని తంజావూరు మండలం "తిరువారూరు" పుణ్యక్షేత్రానికి మహారాష్ట్ర ప్రభువుల ప్రోత్సాహంతో వలస వెళ్లారు శ్రీ త్యాగరాజు పూర్వీకులు. ములకనాటి శాఖకు, భరద్వాజ గోత్రానికి, ఆపస్తంబ సూత్రానికి చెందిన ఈ వైదిక బ్రాహ్మణ కుటుంబంలో వేద సంస్కృత విద్యలకూ, రామాయణ ప్రవచనానికీ ప్రసిద్ధి వహించిన రామబ్రహ్మం, సీతమ్మ దంపతుల గర్భశుక్తి ముక్తాఫలంగా అవతరించిన ఆనంద సంపత్ఫలం నాదబ్రహ్మ శ్రీ త్యాగరాజస్వామి. తిరువారూరులోని శివాలయంలో "కమలాంబ త్యాగరాజస్వామి" అనే పేర్లతో కొలువై ఉన్నారు శివపార్వతులు. శ్రీ త్యాగరాజస్వామి అనుగ్రహంతో క్రీ.శ. 1767, మే 4వ తేదీ సర్వజిత్ నామ సంవత్సర వైశాఖ శుద్ధ షష్ఠి సోమవారం రోజున అవనీ తలాన్ని సంగీతామృత తరంగాల్లో ఓలలాడించడానికై అవతరించాడీ పుంభావనాద సరస్వతి త్యాగయ్య.

పల్లవి: ఉదయించెనదే ధ్రువతార!
రామగానరస మధుధార ! ॥ఉద॥

1. సీతమ్మకు రామబ్రహ్మమునకు
తిరువారూరున భవతారకుడై
రామభక్తి - సంగీత సుధాఝురి
త్యాగరాజ వాగ్గేయ కళానిధి. ॥ఉద॥

2. వాణి వాల్మీకి నారదాంశలను
నవ్య స్వర సమ్మేళన గతులను
శ్రీ సర్వజిత్తు సంవత్సరమున
గ్రహములన్ని శుభగతుల గాంచగా ॥ఉద॥

3. శిశువు గొంతులో సప్త స్వరములు
మాట మాటలో తేటతేనియలు
పలుకు పలుకులో పద సౌరభములు
పావనరీతుల పరిమళించగా ॥ఉద॥

॥ఉద॥



సంగీతామృత తరంగాల్లో జీవకోటిని తేలించడానికి అవతరించిన ఆ అపురూప శిశువుకు ఆనందడోల - ఉయ్యాల జోల.

పల్లవి : లాలీ లాలీ లాలీ లాలీ
చిన్నారి తండ్రీ శ్రీరామ లాలీ
లాలీ లాలీ లాలీ లాలీ
చిన్నారి తండ్రీ! సీతమ్మ లాలీ! . . . లా . . . , లీ . . . , ॥లాలీ॥

1. సీతమ్మ తల్లి రామయ్య తండ్రి
హనుమంతుడన్న - నీకయ్య లాలీ ॥లాలీ॥

2. విరిమోవిపైన చిరునవ్వు సోన
చిరునవ్వులోన వెన్నెల్లవాన ॥లాలీ॥

3. కనురెప్ప పాన్పైన కల్లోల పడక
కనురెప్పలరమూసి నిదురించవయ్యా ॥లాలీ॥

4. మాకంటి మణివై మాయింటి సిరివై
చిరకీర్తి వెలుగొంది వర్ధిల్లవయ్యా ॥లాలీ॥

॥లాలీ॥

తల్లి సీతమ్మ పాడే పురందరదాసు, నారాయణతీర్థ, రామదాసు, జయదేవాదుల వందలాది కీర్తనలూ, తండ్రి రామబ్రహ్మం చేసే రామాయణ ప్రవచనాలూ బాలత్యాగరాజు మనస్సుపై చెరగని శ్రీరామ ముద్రలు వేశాయి. తండ్రి ఉపదేశించిన శ్రీరామ తారకమంత్రం జపిస్తూ, నిరంతర రామపూజా కార్యక్రమాల్లో పాల్గొనే త్యాగయ్య నోట అప్రయత్నంగా రామకీర్తనలు రసప్లావితంగా పరిమళించడం ప్రారంభించాయి. ఉపనయనం జరిగింది. తంజావూరు అర్ధసింహాసనాన్ని అధిష్ఠించిన మహాసంగీత విద్వాంసుడు శొంఠి వేంకటరమణయ్య శిష్యత్వం లభించింది.



పల్లవి: నమోనమో రాఘవాయ అనిపాడుచు దినముదినము
నీరజాక్ష పదసేవా నిరతి పెరిగె త్యాగరాజు ॥నమో॥

1. పూటకొక్క కళగా - ముప్పూటల హరిపూజలతో
ముద్దుముచ్చటల పెరిగెను కనువిందుగ త్యాగరాజు ॥నమో॥

2. తనవాజ్మానసకర్మలు శ్రీరామార్పణములనుచు
భౌతికములు వ్యర్థమనుచు తలచి మెలగె త్యాగరాజు ॥నమో॥

3. ఆనిష్ఠకు తగినట్లుగ రామషడక్షరి నిచ్చెను
రామకృష్ణయతి - మురియుచు స్వీకరించె త్యాగరాజు ॥నమో॥

॥నమో॥

త్యాగయ్య 14వ ఏట తండ్రి రామబ్రహ్మం పరమపదించాడు. అనతికాలంలోనే భర్తను అనుసరించింది సీతమ్మ. అన్నగారు పాలిభాగాల పంపకంలో, తండ్రి పూజిస్తూ వచ్చిన శ్రీరామ పంచాయతనాన్ని మాత్రమే ఇచ్చాడు త్యాగరాజుకు. రామశబ్దం తప్ప మరోమాట నోటరాని త్యాగరాజు వివాహం జరిగింది. ఆ తర్వాత ఐదేండ్లకు ఆమె గతించగా ఆమె చెల్లెలు కమలాంబతో ద్వితీయం జరిగింది. వారికి సీతాలక్ష్మి అనే కూతురు ఉదయించింది. ఆమెకు అఖిలాండం కుప్పస్వామి అయ్యరుతో వివాహం జరిగింది. వారికొక కుమారుడుదయించాడు. కానీ, ఏది ఏమైనా త్యాగయ్యకీలోకం పట్టదు. భౌతిక సుఖాలు తలకెక్కవు. మెలకువలోను నిదురలోను రాముడే. నిధి కన్నా రాముని సన్నిధే గొప్పదని తంజావూరు ప్రభువు శరభోజీ ఆహ్వానాన్నే తిప్పికొట్టాడు.

వీధులవెంట రామకీర్తనలు పాడుతూ ఉంఛవృత్తితో జీవనం గడిపే త్యాగయ్య - కాంచీపుర రామకృష్ణ యతీంద్రుల ఉపదేశంతో శ్రీరామషడక్షరి 96 కోట్లు జపించి శ్రీరామసాక్షాత్కారం పొందాడు. నారద మునీంద్రుల అనుగ్రహంతో 'స్వరార్ణవం' సంపాదించి - సంగీత సర్వస్వ సమగ్రమూర్తిగా రూపొందాడు నాదనిధి త్యాగయ్య.



పల్లవి: ఎందరో మహానుభావులు - అని త్యాగరాజు
అందరికిని వందనమిడు ॥ ఎందరో ॥

1. రాజుల పూజలను గొనక
రాగసుధాయాగ యోగ
త్యాగభోగ సత్ఫలముల
రాజిల్లెను త్యాగరాజు. ॥ ఎందరో ॥

2. భక్తి భిక్ష మీయవెయని
ఉంఛవృత్తి తనువు నిలిపి
నాదాధీనుని రాముని
నమ్మి కొలిచె త్యాగరాజు ॥ ఎందరో ॥

3. గ్రహబలమును నమ్మక - శ్రీ
రామానుగ్రహ బలమే
బలమని తేజోమయ - వి
గ్రహు డయ్యెను త్యాగరాజు ॥ ఎందరో ॥

॥ ఎందరో ॥

"సంగీతం ముక్తి కారకం మాత్రమే కాదు - సంగీతమే ముక్తి" అని త్రికరణాత్మకంగా విశ్వసించిన శ్రీ త్యాగరాజస్వామి - భేదములేని భక్తితో వివిధ దేవతలను స్తుతించాడు. సంగీతానంద స్వరూపుడై తన జీవన యాత్రలో ఎన్నో మహిమలు చూపించాడు. ఎందరికో మేలు చేశాడు. వాటిలో ముఖ్యమైనది తిరుపతి సమీపంలోని పుత్తూరు అనే గ్రామంలో గుడి బావిలో ప్రమాదవశాత్తు పడి మరణించిన శేషయ్య అనే భక్తుని "నా జీవాధారా! నా నోము ఫలమా!" అనే శ్రీరామ కీర్తన పాడి పునరుజ్జీవితుని చేయడం.



పల్లవి: నాదతనుమనిశం - త్యాగరాజేశ పదమనిశం.
నాదతనుమనిశం - త్యాగరాజేశ పదమనిశం. ॥నాద॥

1. తిరువీధుల - శిష్యులు శ్రుతిలయలై
తనను కొలువ - రాముని భజనలతో
సంగీతామృత నిధులు కురిపించె
పరమభాగవత వరణీయాకృతి ॥నాద॥

2. శివకేశవ భేదములను విడిచి
వివిధ దేవతల భక్తి నుతించి
గానబలముచే వేంకటేశ్వరుని
సన్నిధి - మూసిన తెర తీయించిన ॥నాద॥

3. తారకనామ సంకీర్తన శక్తిని
మానస యోగ సంపూర్ణ నియుక్తిని
పుత్తూరున బావిని మరణించిన
యాత్రికునికి జీవనమిడి కాచిన. ॥నాద॥

॥నాద॥

అచంచల రామభక్తితో జగదానంద కారకుడైన త్యాగరాజు "కలౌకేశవకీర్తనమ్ - కలౌతు స్మరణాన్ముక్తిః" అన్న సూక్తులననుసరించి శ్రీరామ సంకీర్తనంతో భక్తులకు ముక్తిని ప్రసాదిస్తూ ఏడువందలపైగా రామకీర్తనలు వెలయించాడు. "సీతారామ విజయము, ప్రహ్లాద విజయము, నౌకా చరిత్రము" వంటి సంగీతకృతులు రచించాడు. త్యాగయ్య శ్రుతిచేసిన కీర్తనలు దాదాపు 205 రాగాల్లో ఉన్నాయి. వాటిలో వందపైగా త్యాగయ్య సృష్టించినవే. లోకంలోని శోకాన్ని మటుమాయం చేయగల ఏకైక సూత్రం శ్రీరామ కీర్తనమేనని ఉద్ఘోషించాడు.



పల్లవి : జగదానంద కారకా! జయత్యాగరాజ దేశికా!
జగదానంద కారకా! జయత్యాగరాజ దేశికా! ॥జగ॥

1. లోకమె శోకమయమ్మని గుర్తించి
నామకుసుమముల రాముని అర్చించి
సులభరీతిలో భవతారక గతి
బోధించిన శ్రీ త్యాగరాజ వర! ॥జగ॥

2. కలిలో హరికీర్తనమే ఘనమని
వర్తమాన మానవులకు సుఖమని
మధుర మధుర పద మృదులయ విధముల
రాగ తాళమేళన మొనరించిన ॥జగ॥

3. అతి వైరాగ్యము శ్రుతపాండిత్యము
మహిత భాగవత వినుతజీవనము
రామగాన విఖ్యాత నిధానము
నీ అవతారము పరమ పావనము. ॥జగ॥

తన మీది కోపంతో అన్నగారు కావేరిలో పడవేసిన శ్రీరామ పంచాయతనాన్ని, తన సంగీత శక్తితో వెలికి రప్పించిన పరమ భాగవతోత్తముడు శ్రీ త్యాగరాజ స్వామి. ఆయన ఎక్కడ ఉంటే అక్కడే ఉంటాడు, శ్రీసీతాలక్ష్మణభరత శత్రుఘ్న హనుమత్ సమేతుడైన శ్రీరామ చంద్రుడు. త్యాగయ్య స్మరణం - శ్రీరామ సన్నిధికి దివ్య సోపానం. ఆయన మనందరి ఇండ్లకూ రావాలి. అందరి గుండెల్లోనూ సప్తస్వర స్వర్ణవేదికపై కొలువు తీరాలి.



పల్లవి: రార! మాయింటిదాకా! - శ్రీరామ
నామరుచి అత్మసోకా........, ॥రార॥

1. రార! శ్రీత్యాగరాజా! భవబంధ
నాశవిస్తార తేజా! ఆఆఆ!
రార శ్రీ త్యాగరాజా!
ముంగురులు చెరలాడు - భూమిజాపతి ముద్దు
మోము చందురుడు మా
మదిలోన ఉదయించ ॥రార॥

2. రామాభిరామ శతరాగ రత్నములతో
ధర్మార్థ కామ మోక్షములనిడు దీక్షతో
తనువు పులకించగా - జన్మ తరియించగా
నీభక్తి లవలేశమైన అలవడగా ॥రార॥

3. పవమాన సుతుడు నిశ్చల భక్తితో పట్టు
పాదారవిందముల మా ఆత్మ విరియింప
భరత శత్రుఘ్న లక్ష్మణ భూమిజలు కొలుచు
దివ్యావతార చిత్కళలు వికసించగా ॥రార॥

శ్రీరామ కీర్తన కన్నా, శ్రీరామునే నాదాధీనుని చేసి లోకానికి పంచిపెట్టిన శ్రీ త్యాగరాజ సంకీర్తనమే మహత్తరమని మనసారా విశ్వసించి, సంగీత సర్వస్వపుమాకృతి ఐన శ్రీ త్యాగరాజ స్వామిని మహాభక్తితో వినుతిస్తున్నాడు ఈ వసునందన్.

పల్లవి: జయ జయ శ్రీ త్యాగరాజ!
జనకజవర భక్తతేజ ॥జయ॥

1. నమ్మిన సీతారాముల
పదముల బహు పదములల్లి
భవబంధము దీర్చిన - నీ
నామ రూపములకు జయము ॥జయ॥

2. తేనెలొలుకు నీ కృతులకు
నాద తాళలయ గతులకు
భక్తి భావ సంపదలకు
జయ మంగళ హారతులివె ॥జయ॥

3. నాదముతో రామచంద్ర
దేవుని ముడి వేసిన - శ్రీ
త్యాగరాజ దేవ! కొనుము
వసునందను వందనములు ॥జయ॥

॥జయ॥



# శ్రీ వాసవీమాత

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవి ఆర్యవైశ్యుల దేవత. 'వాసవాంబ - కన్యకాంబ' అనే పేర్లతో పూజలందుకొంటూ జగత్ప్రసిద్ధి వహించి, అమెరికాలోని లాస్ ఏంజిల్స్ వంటి విదేశ ప్రఖ్యాత నగరాల్లో కూడా నెలకొన్న శ్రీవాసవీమాత, కేవలం వైశ్యులకులదేవత మాత్రమే కాదు - శ్రీ చక్రసింహాసనస్థయై విరాజిల్లే ఆది పరాశక్తి అపరావతారం. ఆస్తికులైన వారందరికీ ఆరాధ్యదేవత.

ఉత్తమ మానవీయ దృక్పథంతో చూస్తే - దుష్టులకు దండనతో కాక, అహింసా మార్గంతో ఆత్మ పరివర్తన కలిగించాలనే మహదాశయాన్ని పాటించిన సత్యాగ్రహి. తన అగ్నిప్రవేశం తెలిసిన వెంటనే కామాంధుడైన రాజు పరివార సమేతంగా తలపగిలి మరణించాలని శాసించిన శాపానుగ్రహ సమర్థురాలు. అందుకే "చరిత్రలో మొట్టమొదటి సత్యాగ్రహి శ్రీవాసవీ కన్యకా పరమేశ్వరి" అన్నారు జాతిపిత గాంధీజీ. నమ్ముకున్న భక్తులకు చతుర్భుజ సమేతంగా సర్వాలంకార భూషితయై విశ్వరూపం చూపించి, సకలధర్మాలు బోధించిన ఆదిశక్తి స్వరూపిణి శ్రీవాసవి. ఆ అమ్మ కథే ఈ "శ్రీవాసవీ మాత".

పల్లవి: కనరండి కనరండి కన్యకాతేజము
వినరండి వినరండి వాసవీ చరితము ॥కన॥

1. దుర్మార్గముల బాపి సన్మార్గముల చూపి
కలుషమ్ములనుగాల్చు కమనీయమూర్తీ!
సౌందర్య సౌశీల్య సౌభాగ్య చాతుర్య
రసరాజ్యములనేలు రమణీయశక్తీ! ॥కన॥

2. ఓంకార హ్రీంకార క్లీంకార రాజిత
శ్రీచక్ర ఘనశక్తిమయ రూపమూ!
వరదాన కరమైన పరమ పావనమైన
పరమేశ్వరీదేవి అవతారమూ! ॥కన॥

3. చింతామణీ! దుర్గ! చండికా! శారద!
మాయా! త్రిలోచని! భద్రకాళీ!
వైష్ణవి! పరాశక్తి ! ప్రకృతీ ! విజయ !
దివ్య రూపముల వెలుగు దీపమూ ! ॥కన॥

4. మాతా నమో! విశ్వమాతానమో !
శ్రీ వాసవీకన్యకాంబా నమో !
శుకపద్మ వీణావరదహస్త శోభిత
శతపత్ర జలజాతవాసా నమో ! ॥కన॥

॥కన॥



సకల చరాచరసృష్టికి మూలకారకుడైన బ్రహ్మదేవుని అనుజ్ఞచేత మణిమయ గోపుర ప్రాకార విరాజితమై, పరమ సుందరోద్యానవన తటాక మహితమైన పెనుగొండ పురాన్ని నిర్మించాడు దేవశిల్పి విశ్వకర్మ. ఆ పురవరంలో యజన, అధ్యయన, కృషి, వాణిజ్య, గోరక్షణ, దానధర్మాది సత్కర్మలనూ, సదాచారాలనూ త్రికరణశుద్ధిగా నెరవేరుస్తూ పరమశివార్చన శీలుడై వెలుగొందుతున్నాడు ఆర్యవైశ్య వంశ సుధాబ్ధి చంద్రుడు శ్రీ కుసుమ ప్రభువు. ఆయన దేవేరి శ్రీ కుసుమాంబిక. చిరకాల సంతాన వాంఛతో తమ కుల పురోహితుడైన శ్రీ భాస్కరాచార్యుల నేతృత్వంలో పుత్రకామేష్టి నిర్వహించారు ఆ పుణ్య దంపతులు. ఆ యజ్ఞఫలంగా పుత్రికారత్నం శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవీ, విరూపాక్షుడు అనే సుపుత్రుడూ శశిభాస్కరతేజో విరాజితులై కవలలుగా ఉదయించారు.

పల్లవి: అవతారమెత్తింది మాయమ్మ కన్యక
అందచందాల ముద్దులదేవ కన్యక ॥అవ॥

1. బోసినవ్వుల వెలుగువెన్నెలల దీపాలు
కాలుచేతుల కరిగి పారేటి పగడాలు
పాలబుగ్గల పూలు పూయు మందారాలు
తలపైన తరగలై ఆడేటి నీలాలు ॥అవ॥

2. ఉయ్యాలలో పాప ఊరికే కనుపాప
తీగరాగము మేలుకొలుపు భూపాలమై
జనులంత కనులింతచేసుకొని చూడగా
కన్న వారల మోముకాంతి వికసించగా ॥అవ॥

3. శ్రీలక్ష్మి భూమిపై చిందులిడ వచ్చెనా ?
వాగ్దేవి వాసవీ మాతయై పుట్టెనా ?
అద్రిపుత్రిక శిశువు అవతారమెత్తెనా ?
అని సకలలోకములు కని పొంగి పోవగా ॥అవ॥



జన్మించడంతోనే తల్లిదండ్రులైన దేవకీ వసుదేవులకు, విశ్వరూప సందర్శన భాగ్యం కలిగించిన శ్రీకృష్ణ పరమాత్మలాగా శ్రీవాసవీమాత చతుర్భుజమూర్తియై, చేతులు నాలుగింటిలో పాశము, పద్మము, శుకము, వీణధరించి, ధర్మార్థకామ మోక్షాలనే, చతుర్విధ పురుషార్థాలను సకల జీవులకు ప్రసాదించే పరదేవతయై, పరమ సౌందర్య పరిశోభిత దివ్యరూపంతో సాక్షాత్కరించింది తల్లిదండ్రులకు. ఆమెను ఆది శక్తిగా భావించి నమస్కరించారు ఆ అదృష్టవంతులు. ఆ తర్వాత బాలలీలలు చూపే శ్రీ వాసవీ మాతకు, గుండెలో ఆనందపారవశ్యం పాలవెల్లియై పరవళ్ళు త్రొక్కగా, సాటిముత్తైదువలతో కలిసి లాలి పాటలు పాడుతున్నది శ్రీ కుసుమాంబికాదేవి. అంబర వీధిలో బారులు తీరి పూలవానలు కురిపిస్తున్నారు ముక్కోటి దేవతలు.

పల్లవి: ఉళలలలోలలలలలో ఆయీ !
ఉళలలలోలలలలలో ఆయీ !
ఉయ్యాలా జంపాలా ! ఉయ్యాలా జంపాలా ! ॥ఉళ॥

1. నీలాల కన్నుల్ల రెప్పల్లువాల
చిరునవ్వులొలికించి నిదురించవమ్మా !
చిరుగాలి కదలాడు ముంగురుల చాయ
ముఖచంద్రునికి కోటి అందాలు పూయ ॥ఉళ॥

2. శోకమయమని పుడమి చీకాకు పడక
రాకాసిమానవుల లక్షణము వినక
ఆనందలోకాల అలరారవమ్మా !
పసితనములోని వైభవము గనవమ్మా ! ॥ఉళ॥

3. ఈరేడులోకాలు నీకు ఉయ్యాల
వేదాలు నాలుగు వ్రేలాడు తాళ్ళు
మురిపాల జోలలే సరిగమలు తల్లి
నీ నిదుర జగతికే నిండుదనమీయ ! ॥ఉళ॥

॥ఉళ॥



పూటకొక్కకళగా, బంగారానికి పరిమళం అబ్బి ప్రాణాలు పడినట్టుగా ఎదుగుతున్నది శ్రీ వాసవీ మాత, అల్లారుముద్దుగా.

పల్లవి: ప్రాణము పడిన పైడిబొమ్మా ! విలసిల్లె
ప్రతినిత్యకళ కన్యకమ్మా ! ॥ప్రాణము॥

1. అరికాళ్ళు పద్మాలు చిరుగోళ్ళు మల్లికలు
మీగాళ్ళు పసిమిచిమ్మెడి ముద్దబంతులై
ఎంతవారికినైన ఇంతింతనగరాని
భక్తి కలిగించు - శ్రీపాద సౌభాగ్యాలు ॥ప్రాణము॥

2. ఆడవారికినైన చూడమోహము పుట్టు
దివ్యసౌందర్యాల దినదినము వర్ధిల్లె
అమ్మనడచిన నేల - అసలైన బంగారు
ఆకంటి చూపులే - అమృతాభిషేకాలు ॥ప్రాణము॥

3. కంటికింపగు ముక్కు, కనుబొమల హరివిల్లు
చెవులు శ్రీకారాలు, చెంపలే కెంపులు
ఎత్తైన ఎదపైన ఎగిరిపడు హారాలు
అంగాంగముల కాంతిగంగా ప్రవాహాలు ॥ప్రాణము॥

॥ప్రాణము॥

ఉన్న ఊరిలోనే కాక పల్లె పట్టులకూ, పాటక జనానికీకూడా ప్రాకింది శ్రీవాసవీమాత చక్కదనం. ఎలుగెత్తి వేనోళ్ల అమ్మను కీర్తిస్తున్నారు. జానపదులు నిసర్గ సుందర భావాలతో.......

పల్లవి: ముద్దులగుమ్మ కన్నెకమ్మ సందమామా !
సెమ్మా సెక్క ఆటలాడే సందమామా !
సందమామా ! సందమామా ! సందమామా !
సందమామా ! సందమామా ! సందమామా ! ॥ముద్దుల॥

1. సక్కని సుక్క జున్ను ముక్క సందమామా !
తియ్యని పాటల కోయిలపిట్ట సందమామా !
సల్లని సూపే ఎన్నెల ఎలుగు సందమామా !
పిల్లనవ్వే మల్లె పువ్వు సందమామా ! ॥ముద్దుల॥

2. ఏడూమల్లెల ఎత్తు సూడు సందమామా !
ముట్టూకుంటె మాసిపోవు సందమామా !
ఒయ్యారాల రామచిలుక సందమామా !
కన్నులు రెండు సొలవు సూడ సందమామా ! ॥ముద్దుల॥

3. తలుకూబెలుకుల కీలుబొమ్మ సందమామా !
సాటేలేదు ఏలోకాన సందమామా !
కిలకిలలాడే ముద్దులగుమ్మ సందమామా !
ముద్దుల గుమ్మకు మొగుడెవరమ్మా సందమామా !
సందమామా సందమామా సందమామా ॥ముద్దుల॥

॥ముద్దుల॥



ధరాలోభంతో దండయాత్రలు చేస్తూ, వసుధాతలాన్ని అమాయక జనరక్తంతో ముంచెత్తుతూ, దారిలో పెనుగొండకు దాపురించాడు నేలనేలే క్రూర భూపతి. సదాచారాన్ని పాటించి, ఆతిథ్యం ఇచ్చిన కుసుమభూపతి కన్నకూతురు మీదనే కన్ను వేశాడు. అన్నం పెట్టిన చేతినే ఛిన్నాభిన్నంగా కరిచివేయడానికి సంసిద్ధమైనాడు. రత్నాలూ, రాజ్యాలూ, రమణులూ వీర భోజ్యాలనే దుర్మదంతో కన్నుగానక - నిప్పవంటి వాసవీ మాతనే చెట్టపట్ట సాహసించాడు. భయసంకోచాలు లేక సచివులను రాయబారం పంపించాడు కుసుమ భూపతి చెంతకు.

పల్లవి: కాలము విషమము కడు విచిత్రము
కసిగొని బుసలిడి కాటిడు సర్పము ॥కాలము॥

1. భుజబలము ధనబలము గజతురగ రథబలము
మహిత సేనాబలము మానవత మాపగా
మదమెక్కి, మంచిచెడు మరచి రాజాధముడు
వాసవీ మాతనే ఆసపడి చెలరేగె ॥కాలము॥

2. ఏమి చేసినగాని ఎదురేది తనకనుచు
మనుజేశునెదిరించు మగధీరుడెవడనుచు
కన్నుగానని కండకావరమ్మున ఖలుడు
తల్లినే చెరపట్టదలచి విజృంభించె ॥కాలము॥

3. ధరణి జనులనుగాచు ధర్మ సరణిని గాల్చె
మంత్రులను వాసవీ మాతకై పంపించె
ఎగ్గుసిగ్గులు లేక ఎటువంటి పనినైన
కాముకుడు చేయునను సామెత నిజము చేసె ॥కాలము॥

॥కాలము॥



కన్యనిచ్చి పెండ్లి చేయక తప్పదన్న రాజాజ్ఞను విని, సకుటుంబ సపరివారంగా పరితపించి పోతున్నాడు కుసుమభూపతి

పల్లవి : ఏమి ఘోరము ఈశ్వరా!
ఏది గతి పరమేశ్వరా ! ॥ఏమి॥

1. పాడు కామమె పరమ సుఖమని
పరము మరచెను పాపకర్ముడు
కన్న బిడ్డల కరణి ప్రజల
అరయు కర్తవ్యమును విడిచెను. ॥ఏమి॥

2. వర్ణధర్మము మంచి చెడ్డలు
ప్రభువె విడిచిన ప్రజలకేగతి ?
కులమువారలు క్రోధమున - ఢీ
కొట్టగా తొడగొట్ట సాగిరి. ॥ఏమి॥

3. ప్రతిఘటించెడి బలము కలదా
సకల బలయుత సార్వభౌముని ?
కన్నెకిష్టము కానిపని - తల
పెట్టగలమా ? భీరువులమై ? ॥ఏమి॥

॥ఏమి॥

ఆర్యవైశ్యుల్లోని 714 గోత్రాలవారూ వాసవీమాత విషయంలో కులగురువు భాస్కరాచార్యుల వారి ఆధ్వర్యంలో ధర్మ నిర్ణయానికి సమావేశమైనారు. కన్యకిష్టము కాని పెండ్లి చేయడం కన్నా - అగ్ని ప్రవేశం చేయడమే తనకు సమ్మతమని కుసుమ భూపతి ప్రకటించాడు. అది ధర్మసమ్మతమని భాస్కరాచార్యులు నిర్ణయించారు. రాజు దండయాత్రను తిప్పి కొట్టడానికి యువసైన్యాన్ని సమీకరించి వాసవీమాత సోదరుడు విరూపాక్షుడు సైన్యాధ్యక్షుడుగా నిలిచాడు. అమ్మకు వచ్చిన సమస్యకు పెద్దలతో పాటు పిల్లలూ కదిలిపోయారు.. బాలభట సైన్యంగా రూపొంది పిల్ల సింహాలై గర్జించారు. బాలభట సైన్యాధిపతి శివప్రసాద్. ఇన్ని ఏర్పాట్లు జరుగుతున్నా, రాజసైన్యాలు తమను వధిస్తాయనే భయంతో 612 గోత్రాల వారు నగరం విడచి పారిపోయారు. తక్కిన 102 గోత్రాల వారు మనుగడైనా మరణమైనా అమ్మతోనే అనే ధృఢ ప్రత్యయంతో మేరునగధీరులై నిలిచారు. ఇవన్నీ గమనించిన వాసవీ మాత వికసించిన కమలంలాంటి హాసన్ముఖంతో ఇలా సెలవిచ్చింది. "ఆ అధమ భూపతి నన్నుగానీ, మిమ్ములనుగానీ, ఈ పెనుగొండ నగరాన్ని గానీ ఏమీ చెయ్యలేడు. వాని సేనలు నగరం పొలిమేరలు సమీపిస్తే చాలు, విలవిలలాడుతూ ప్రాణాలు విడుస్తాయి. వివేకహీనుడైన భూపతి తల వేయి ప్రక్కలౌతుంది. ఇది నా శాపం. నేను ఆదిశక్తిని. పరాశక్తిని. దుర్మార్గుడైన ఆ అధమ భూపతిని శిక్షించడానికే నేను వైశ్య వంశంలో జన్మించాను. అది ఈ విధంగా నెరవేరుస్తాను" అని చెప్పి అమాయాయులైన 102 గోత్రాల వైశ్యులకూ అన్ని ధర్మాలు బోధించి, తన విశ్వవిరాడ్రూపం చూపింది శ్రీ వాసవీ మాత. అందరూ భక్తితో ప్రణమిల్లారు. ఆ తర్వాత దుఃఖానంద విస్మయ పూర్ణమైన మనస్సులతోకులజులు పేర్చిన అగ్ని గుండంవైపు నడిచింది శ్రీ వాసవీ మాత.



పల్లవి : కదిలింది కదిలింది వాసవీ మాత !
దక్షయజ్ఞమునాటి సతివలె పునీత ! ॥కదిలింది॥

1. దివ్యదీక్షా దీప్తి తేజరిలు మోము
అరుణ చంద్ర ప్రభలు విరజిమ్ము కనులు
ఉచ్ఛ్వాస నిశ్వాసముల కరుణ వెలుగ
నిలువెల్ల ఆదిశక్తి ప్రభలు చెలగ ॥కదిలింది॥

2. పోటెత్తు సాగరమువోలె బాంధవులు
సతిసుత సహోదర సహితముగా నడువ
అవతారమును వీడ అనల వేదికకు
కదిలింది కదిలింది కన్యకామాత ॥కదిలింది॥

3. కన్నీరు మున్నీరులై జనులు కరగ
సతివెంట పెనుగొండ సకలమ్ము సాగ
దీన ఘోషముల దశదిశలు ఘూర్ణిల్ల
నడిచింది మేలి చిరునగవుతో మాత. ॥కదిలింది॥

4. అదిగదిగో ప్రజ్వరిల్లెడి అగ్నిగుండం
మహిత దీక్షాదీప్తిమయ యజ్ఞ కుండం !
చెలరేగు వెలుగు రవ్వలు దిశల కెగుర
చిటపటార్భటులు విస్ఫులీత కురియ
రప్పమని అగ్ని నాల్కలుసాచి మెరయ
నడిచింది ఎదురు కన్యక దివ్యమాత ॥కదిలింది॥

॥కదిలింది॥

# బుర్రకథ

కథకుడు : భగభగ మండే అగ్ని శిఖలలో
పదము బెట్టినాదా !
వంతలు : మా కన్యకమ్మా !
కథ : కుసుమ పేశలము సుందర దేహము
కాంతి పెరిగినాదా !
వంత : తందానతాన
కథ : అయ్యో ! అయ్యో ! అమ్మా ! అమ్మా !
అనుచు జనులు వగవ ॥తం॥
వేయినాలుకల వీతిహోత్రుడు వెనుకముందులాడ ॥తం॥
అన్ని దిశలు నిర్విణ్ణదృష్టితో అమ్మను తిలకించ ॥తం॥
అగ్నిలోని బంగారు బొమ్మగా అమ్మ మెరిసిపోయె ॥తం॥
అరరే - దండయాత్రకై వచ్చిన సేనల తనువులు విడనాడే ॥తం॥
అరరే - పరదేవత కథవిన్న భూపతి శిరము పగిలి చచ్చే ॥తం॥
ఓహో - వెంట నడుచు తనతోడి గోత్రముల విజ్ఞలు తరియించ ॥తం॥
ఓహో - పద్మపాశ వీణాకీరమ్ముల వరదహస్తములతో ॥తం॥
ఓహో - ఆదిశక్తియై నాల్గు భుజమ్ముల అమ్మ అవతరించే ॥తం॥
ఓహో - ఆ అవతారము కాంచి మ్రొక్కుచును అందరు వినుతింప ॥తం॥
ఆహా - సూర్యకోటి సంకాశ తేజమ్మున చోద్యము కలిగించి ॥తం॥
ఆహా - భక్తులందరికి పరమ ధర్మముల పరమార్థము తెలిపి ॥తం॥
ఓహో - అంతర్థానమునందె వాసవి ఆదిపరాశక్తి ॥తం॥
వంతలు : తందానా తందాన తందనా తానె తందానానా ॥తందానతాన॥

॥తందానతాన॥

తా-తకిటతరి - తరికిట ఝుంతరి - తా



# అమరజీవి

పల్లవి: తీయ తీయగా పాడే కోయిల
పాట అమనికి - మాతృభాష ॥తీయ॥

1. తొలకరి మబ్బుల - తళతళ మెరుపుల
మురిసి, పింఛమును విరిసి నటించే
నెమలి అడుగులో కులికే అందము
రసనాట్యానికి - మాతృభాష ॥తీయ॥

2. మాతృభాష పై మనుషులందరికి
మధురమైన మమకారమే కదా !
ఆ మధురిమలను ఆంధ్రజనాళికి
అందించెను మన - అమరజీవి ॥తీయ॥

॥తీయ॥

# బుర్రకథ

వంతలు: తా - తకిటతరి - తరికిట ఝుంతరి - తా
ఎవరయ్యా - ఆ అమరజీవి ? ఏమిటి ఆతని చరిత్ర ?
వినిపిస్తారా వీనులవిందుగా ?
కథకుడు: వినరా ఆంధ్రకుమారా ! ధీరా! - అమరజీవిగాథా!
వంత : తందాన తాన
కథ : వినరా - ఆంధ్రకుమారా! ధీరా! అమరజీవిగాథా! ॥తం॥
ఆత్మాహుతితో ఆంధ్రభాషనే కొలిచిన మహరాజు ॥తం॥
ఆత్మార్పణతో ఆంధ్రరాష్ట్రమును నిలిపిన మహరాజు ॥తం॥
అసువులు పోసి ఆంధ్రులందరిని సాకిన మహరాజు ॥తం॥
అరరే - ఆత్మత్యాగ సమగ్ర దీప్తితో వెలిగిన మహరాజు ॥తం॥
॥ - ఎట్టి సుఖములొడిగట్టబోని జగజెట్టి మహారాజు ॥తం॥
॥ - వట్టి మాటలను చెప్పనట్టి ఘన చరితుడు మహరాజు ॥తం॥
॥ - పట్టిన పట్టును విడువనట్టి బల్ గట్టి పిండమతడూ ॥తం॥
॥ ॥ ॥
అతడే - పొట్టి శ్రీరాములు ఆంధ్రరాష్ట్రమును పట్టి తెచ్చినాడా ॥తం॥
॥ - ఆత్మార్పణతో అమరజీవియై నిలిచిపోయె భువిలో ॥తం॥
అరరే - నిత్యనిరంతర జీవధారగా పొంగిపారె మనలో ॥తం॥
॥ - ఆత్మార్పణతో ఆంధ్రరాష్ట్రమును నిలిపిన మహరాజు ॥తం॥
॥ - అసువులు పోసి ఆంధ్రులందరిని సాకిన మహరాజు ॥తం॥
॥ - వినరా ఆంధ్రకుమారా! ధీరా! అమరజీవి గాథా! ॥తం॥
॥ ॥ ॥
వంతలు తందానా తందాన తందనా తానె తందనానా ॥
తా - తకిట తరి - తరికిట ఝుంతరి - తా



అమరజీవి పొట్టి శ్రీరాములు గారి తల్లి మహాలక్ష్మమ్మ, తండ్రి శ్రీ పొట్టి గురవయ్య. నివాసం గుంటూరు జిల్లా 'కనిగిరి'. ఉన్న ఊరిలో జీవనోపాధి గడువక ఈ ఆర్యవైశ్య దంపతులు క్రీ.శ. 1901 సంవత్సరంలో ఆనాటి ఉమ్మడి రాష్ట్ర రాజధానియైన మద్రాసు నగరానికి వలసవెళ్లారు. జార్జిటౌన్, అన్నాపిళ్లైవీధి, 103 నెంబరు గృహంలో - 16వ మార్చి 1901 శుభదినాన ఆంధ్ర రాష్ట్రానికి ఆశాజ్యోతిగా ఆవిర్భవించాడు అమరజీవి. అన్న వస్త్రాలు అంతగా లేకున్నా, ఉన్నదానితో సంతృప్తిపడి సంతోషమయ జీవితం కొనసాగించే ఆ తల్లి దండ్రులు కన్న బిడ్డను చూసుకొని కడలెరుగని ఆనందంతో పొంగిపోయేవారు. సాటి సీమంతినులను పేరంటానికి పిలిచి, బిడ్డకు నామకరణం చేసి, సహజ రమణీయ మధుర కంఠంతో జోలపాటలు పాడుతున్నది పరమసాధ్వి మహాలక్ష్మమ్మ.

పల్లవి: లాలీ లాలీ లాలీ లాలీ
శ్రీరాములయ్యా! శ్రీరామలాలీ! ॥లాలీ॥

1. చిన్నారి కనుల ఎన్నెన్నో కళలు
కళలన్ని కురిసె చలువ వెన్నెల్లు
చిటిచిట్టి పిడికిళ్ల నీ పట్టుదలను
చాటించ ఉయ్యాల నిదురించవయ్యా ॥లాలీ॥

2. శ్రీకార కర్ణాలు సిరిమొగ్గ నోరు
అభిమాన గతిచాటు అందాల ముక్కు
కదలాడు పాదాలు కలుషాలదన్న
నీ జాతి ఘనకీర్తి నిలబెట్టవయ్యా ॥లాలీ॥

3. మహనీయ తేజమ్ము వెదజల్లుమోము
కరుణారసము మూర్తి గన్నట్టి రూపు
సత్కార్య సంఘాల సాధించుచుండ
బంగారు కొండా! వర్ధిల్లవయ్యా ॥లాలీ॥

॥లాలీ॥



శ్రీరాములు గారి తండ్రి సంసారబాధ్యతలు పట్టించుకోని యథేచ్ఛా జీవి. తల్లి మహాలక్ష్మమ్మ గారే కుటుంబపోషణ భారమంతా నిర్వహించేది. శ్రీరాములుగారు తల్లికి పనుల్లో యథాశక్తి తోడ్పడుతుండేవారు. తన పుట్టింటి వారు సంపన్నులైనా ఆత్మాభిమానమే ధనంగా భావించే మహాలక్ష్మమ్మ చేయి సాచి అర్థించక, తిరగళ్లు పెట్టుకొని, ముడిదినుసులను పప్పులుగా చేసి అమ్మే వ్యాపారాన్ని నిర్వహించేది. శ్రీరాములుతోపాటు అతని మేనల్లుడు నరసింహగుప్తకూడా అవ్వదగ్గరనే ఉంటూ చదువుకునే వాడు. ఆ పిల్లలిద్దర్ని వారి పేర్లతో కలిపి శ్రావ్యమైన పాటలతో ప్రతీ ఉదయం మేలుకొలుపుతూ ఉన్నత సంస్కార భావాలనూ, కార్యదీక్షనూ నూరిపోసేది ఆ ఆదర్శమాతృమూర్తి మహాలక్ష్మమ్మగారు.

పల్లవి : మేలుకో శ్రీరామ! మేలుకో నరసింహ!
మేలుకో శ్రీరంగ! మేలుకోవయ్యా ॥మేలుకో॥

1. మేలుకోవయ్యు మమ్మేలుకోవయ్యా
మేలుకొని లోకాల పాలించవయ్యా ॥మేలుకో॥

2. జీవులందరు శాంతి సౌఖ్యముల జీవించ
ప్రేమ భావముల పెంపొందించవయ్యా ॥మేలుకో॥

3. మంచి బుద్ధులనిచ్చి, మంచి నడకలు నేర్పి
మమతాను రాగములు మాలోన నెలకొల్పి ॥మేలుకో॥

4. భేద భావము తొలగ, సామరస్యము నిలువ
కులమతాతీతమగు కూర్మి పండించగా ॥మేలుకో॥

5. ఒక్కటే మాటగా ఒక్కటే బాటగా
దేశమున ప్రజలంత జీవనము సాగించ ॥మేలుకో॥

6. త్యాగనిరతిని పెంచి, కార్య శూరత నించి
పిన్నలను పెద్దలను పాలించవయ్యా ॥మేలుకో॥

॥మేలుకో॥



ఆదర్శమాత మహాలక్ష్మమ్మ కన్నుసన్నలలో సంఘసేవా తత్పరత, శ్రమైక జీవనం, ఉన్నత ప్రేమైక భావనలతో పెరుగుతున్న పొట్టి శ్రీరాములుగారు క్రీ.శ. 1907లో ప్రాథమిక విద్యాభ్యాసం ప్రారంభించి - ఎస్.కె. పి. డి. హయ్యర్ సెకండరీ స్కూల్, ప్రోగ్రెసివ్ యూనియన్ స్కూల్, హిందూ థియోలాజికల్ హైస్కూల్ వంటి విద్యా సంస్థల్లో ఉత్తమ విద్యార్థిగా, ఉపాధ్యాయులందరికీ ప్రేమ పాత్రుడై ఉన్నత పాఠశాలా విద్యాభ్యాసం చేస్తూ ప్రతినిత్య వికాసం పొందుతున్నాడు.

పల్లవి : వన్నె చిన్నెల ముద్దు పూర్ణచంద్రునిగా
వర్ధిల్లె బాలకుడు దినమొక్క కళగా ॥వన్నె॥

1. ఏకసంథాగ్రాహి - స్కోప్ మాస్టరటంచు
తోటి బాలురు, గురువులను మెచ్చి పొగడగా,
మదరాసు నగరాన హైస్కూలు చదువులను
అంచెలంచెలుగా ముగించె శ్రీరాములు ॥వన్నె॥

2. శ్రీ వాసవీ కన్యకా మందిరము వారి
కోత్వాలు చావడిని నిత్యహరికథలు విని,
హిందూ మత విధాన వైభవము చర్చించి
భక్తి సంస్కారముల బడసె శ్రీరాములు ॥వన్నె॥

3. సమధికోత్సాహమున షేక్స్పియర్ నాటికల
ప్రముఖ భూమికలూని, పాత్రపోషణ జేసి
వచ్చిన ధనము పేద విద్యార్థులకె చెంద
గరిమతో పెరిగె సత్కళల శ్రీరాములు ॥వన్నె॥

4. ఆట, పాటల ముందు నిలుచు శ్రీరాములే
చదువు, సంధ్యల మొదటివాడు శ్రీరాములే
సంస్కార, సంస్కృతుల నెలవు శ్రీరాములే
విజ్ఞాన, వినయముల కొలువు శ్రీరాములే ॥వన్నె॥

॥వన్నె॥



క్రీ . శ. 1924 నాటికి పొట్టి శ్రీరాములుగారు బొంబేలో సానిటరీ ఇంజనీరింగ్ ముగించుకొని రైల్వేలో ఉద్యోగం పొందారు. తన మేనకోడలు సీతమ్మతో శ్రీరాములుగారి వివాహం జరిపించింది తల్లి. మొట్టమొదటినుండీ కష్టపరంపరలనే ఎదుర్కొంటున్న తల్లిని గౌరవాదరాలతో, నిరంతర ప్రేమతో సుఖపెట్టాలనే సదాశయంతో, సేవాభావంతో, ఆమెను బొంబాయికి రప్పించి, భార్యతో కలిసి పూజించుకుంటున్నారు.

పల్లవి : సృష్టికే సిరివన్నెలూ - మనపొట్టి
సీతమ్మ శ్రీరాములూ ॥సృష్టికే॥

1. మనసులో మనసుగా - మమతలే రూపుగా
ఒకరికింకొకరుగా - ఏకమైపోవగా
తల్లికన్నుల పాలవన్నెలలు పొంగగా
ఆదర్శ దాంపత్యమాచరించిరి కలిసి ॥సృష్టికే॥

2. తనభార్య శ్యామవెర్ణమునెంచి కూర్మితో
నా ప్రేమరససుధా జలధరము నీవనుచు
చిరునవ్వులొలికి శ్రీరాములు దరికి జేర
సీతమ్మ నునుసిగ్గుమొలకయై వెలుగొందు ॥సృష్టికే॥

3. అనురూప దాంపత్యమునుగాంచి మహలక్ష్మి
కొడుకు కోడలు రెండు కనులుగా మురియగా
సంసార సౌఖ్యముల సరిగమలు పండించి
సరిలేని జంటగా సంచరించెడివేళ ॥సృష్టికే॥

॥సృష్టికే॥

కన్నతల్లి సేవే అన్నిపనులకన్నా మిన్నగా భావించే శ్రీరాములు గారు ఆమె అభీష్టాన్నీ, తొలిచూలుదాల్చిన ఇల్లాలి ముచ్చటనూ నెరవేర్చడానికై పరమపావని, విశ్వమాత, శ్రీవాసవీ కన్యకా పరమేశ్వరీ దేవి వెలసిన పుణ్యక్షేత్రం పెనుగొండ సందర్శించాడు. దుష్కామవర్తనలను అంతం చెయ్యడానికై ఆత్మ శక్తి జ్వాలల్లో అవతారం చాలించిన పుణ్యపేటిక శ్రీవాసవీ మాతను మనసారా పూజించి కీర్తిస్తున్నారు.

పల్లవి : మాతానమో ! విశ్వమాతానమో !
శ్రీవాసవీ కన్యకాంబానమో ! ॥మాతా॥

1. దుర్మార్గముల బాపి - సన్మార్గముల చూపి
కలుషమ్ములను గాల్చు కమనీయమూర్తి!
సౌందర్య సౌశీల్య సౌభాగ్య చాతుర్య
రసరాజ్యములనేలు - రమణీయదీప్తి ! ॥మాతా॥

2. ఓంకార హ్రీంకార క్లీంకార రాజిత
శ్రీ చక్ర ఘన శక్తిమయరూపిణీ !
శుక పద్మ వీణా వరద హస్త శోభిత
శత పత్ర దళ జలజ సంవాసినీ ! ॥మాతా॥

3. చింతామణీ ! విజయ ! చండికా ! శారద !
ప్రకృతి ! త్రిలోచని ! భద్రకాళీ !
వైష్ణవి ! పరాశక్తి ! దుర్గాది నామముల
వెలుగొందు ఘన రూప తేజస్వినీ ! ॥మాతా॥

॥మాతా॥



ఎంతటి వారికైనా జీవితమంతా ఒక్క రీతిగా నడవదు. సౌజన్యమూర్తీ, సంఘసేవానురక్తీ ఐన శ్రీరాములు హృదయాకాశాన్ని కూడా విషాదమేఘాలు కమ్ముకున్నాయి. పుట్టిన ఐదవనాడే, పురిటి కందైన పుత్రుడూ, గర్భశోకంతో ఆరునెలల్లో అర్ధాంగి సీతమ్మా, ఆ తర్వాత అనతికాలంలోనే కన్నతల్లీ - ఒకరి తర్వాత ఒకరుగా శ్రీరాములు గారికి దుర్భరశోకం మిగిల్చి తరలిపోయారు. ఆయనపై ఎడతెరిపిలేని పిడుగుల వాన కురిసింది. మరొకరైతే ఆ వెతల మంటల్లో మాడి మసై పోయేవారే. ధైర్య సముద్రుడు కాబట్టి తట్టుకున్నారు పొట్టి శ్రీరాములు. ఎందరెన్ని విధాల చెప్పినా వినక ఇంకా సంపాదన ఎవరినుద్ధరించడానికనే వైరాగ్యంతో ఉద్యోగానికి స్వస్తిచెప్పి జాతి నేత గాంధీజీ అనుయాయిగా సబర్మతి చేరాడు శ్రీరాములు. ఇప్పుడాయన మాటా, మనసూ, తనువూ నిత్యనిరంతరం సంఘసేవకే అంకితమయ్యాయి. సహజంగానే మాతృవత్సలుడైన సహృదయస్ఫూర్తి శ్రీరాములు గారి సర్వస్వమై కూర్చున్నది సంకెళ్లలో ఉన్న భరత మాత. జనని స్థానాన్ని జన్మభూమి అధివసించి శ్రీరాములుగారిని జన్మసార్థక్యంవైపు నడిపించింది. ఖాదీ ప్రచారం, హరిజనుల ఆలయ ప్రవేశం, కుల వర్గ రహిత సమాజం కోసం పోరాటం, ప్రేమ సమాజ నిర్మాణాత్మక కార్యక్రమాలు వెనుదిరుగని దీక్షతో నిర్వహిస్తున్నారు.

పల్లవి : జన్మసార్ధకముగా జన్మభూమి సాక్షిగా
సంఘసేవ దీక్షగా సలిపెను శ్రీరాములు ॥జన్మ॥

1. సబర్మతీ వాటిలో సత్యాగ్రహధాటిలో
జాతినేత గాంధీజీ ప్రియతమ జన కోటిలో
హరిజనోద్యమాదులలో అత్యంత పరిశ్రమతో
జాతీయత పాదుకొలుప సర్వసమర్పణము జేసె ॥జన్మ॥

2. మద్యపానరీతి మాన్పి మానవతను మేలుకొలిపె
అస్పృశ్యత రూపుమాప - అందరి పంక్తిని భుజించె
ఖాదీ ఉద్యమమును, స్త్రీ విద్యాభ్యాస విధానము
వితంతు - వర్ణాంతర కళ్యాణములను ప్రోత్సహించె ॥జన్మ॥

॥జన్మ॥



స్వదేశోద్యమంతోపాటు స్వరాష్ట్రోద్యమంకూడా సమాంతరంగా సాగినకాలమది. క్రీ. శ. 1920 లో నాగపూర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభలో చర్చకు వచ్చిన భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు ఉద్యమంలో భాగంగా ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం ఆవిర్భవించింది. ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఏర్పడాలని ఎందరో ప్రముఖులు, దేశభక్తులు ఆందోళనలు జరుపుతూ వచ్చారు. అంతవరకూ సంఘసేవే పరమార్థంగా జీవిస్తూ వచ్చిన పొట్టి శ్రీరాములుగారు మాటలతో పని జరగడం లేదని భావించి, నేడు మనందరం హాయిగా జీవిస్తున్న ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణ కోసం స్థిర సంకల్పంతో ఆమరణ నిరాహార దీక్ష ఆరంభించారు.

పల్లవి : ఏలేలో ఏలేలో పొట్టి శ్రీరాములు ఏలేలో
ఏలేలో ఏలేలో ఏలేలో జాతికే వన్నెలు ఏలేలో ॥ఏలేలో॥

1. తేనె చినుకుల వంటి తెలుగు పలుకుల మురిసి
ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రమును తేదలచి
ఆమరణ దీక్షతో ఆహారమును విడిచి
ఆత్మార్పణముజేయ సిద్ధపడినాడే ॥ఏలేలో॥

2. కంటిలో రవికాంతి - ఏలేలో - కాయమున శశికాంతి -ఏలేలో
మోవిపై చిరునవ్వు - ఏలేలో - నుదుట బ్రహ్మస్ఫూర్తి -ఏలేలో
నిలువెల్ల త్యాగమే -ఏలేలో - పరులదే జీవనము - ఏలేలో
జలధి గంభీరుడే - ఏలేలో - మేరునగధీరుడే - ఏలేలో
॥ఏలేలో॥

॥ఏలేలో॥

క్రీ . శ . 19వ అక్టోబర్, 1952 రోజున మద్రాస్‌లోని శ్రీబులుసు సాంబమూర్తి గారి వసతిలో ప్రారంభించిన శ్రీరాములుగారి ఆమరణ నిరాహారదీక్ష 15-12-52 వరకు 58 రోజులపాటు సాగింది. ఆంధ్రులకు కొత్త ఊపిరి పోయడానికి పరితపించిన కారణ జన్ముడు, అవతారమూర్తి శ్రీరాములుగారి పవిత్ర దేహం 119 పౌండ్ల బరువు నుండి 84 పౌండ్లకు కృశించిపోయింది.

## బుర్రకథ

కథకుడు : ఆంధ్రప్రదేశ్‌కై ఆమరణాంతం దీక్ష పట్టినాడా!

వంత : అయ్యో........., తందానా తానె తందానానా!

కథ : అయ్యో - ఆంధ్రజనుల - అభ్యుదయం కోసం - అసువులిచ్చినాడా

వంత : అయ్యో...... .. .., తందానా దేవ వందనానా!

కథ : అయ్యో - కళకళలాడే కన్నులకాంతి కళను దప్పినాదా!

వంత : హరిహరి

కథ : పరులకోసమే నిలిచిన దేహం బలముక్రుంగినాదా! ॥హరిహరి॥

మిసమిసలాడే గోధుమవర్ణం మిసిమివీడినాదా! ॥హరిహరి॥

నవనాడులలో నవనవలాడే జవముతొలగినాదా! ॥హరిహరి॥

నీరూ తేనే నిమ్మరసాలే జీవంబైనాయా! ॥హరిహరి॥

నిద్రనైన తన నిష్ఠను విడువని నిర్మలచరితునకూ ॥హరిహరి॥

వంత : అయ్యో . . . . . , తందానా దేవ వందనానా !

కథ : అయ్యో - ప్రముఖులెందరో పరిపరివిధముల పరితపించినారా!

వంత : హరిహరి!



కథ : పత్రికలెన్నో పలువిధాలుగా ప్రస్తుతించినాయా! ॥హరిహరి॥

పరులకోసమే పట్టిన దీక్షకు ప్రజలు క్రుంగినారా! ॥హరిహరి॥

క్రుంగి, పొంగి సర్వాంధ్ర దేశ ప్రజక్రుద్ధరౌద్ర గతిలో ॥హరిహరి॥

హర్తాళ్ బంద్‌లు సభలాందోళనలెన్నో చేసినారా ॥హరిహరి॥

రాజకీయ వర్గాలు తీవ్ర సంక్షోభమొందినాయా ॥హరిహరి॥

వంత : అయ్యో . . . . . , తందానా తానె తందనానా !

కథ : అయ్యో - వాంతులు మొదలై దేహపరిస్థితి అతలకుతలమయ్యె

వంత : హరిహరి!

కథ : గొంతుక వాచీ నీటిబొట్టయిన గుటకే పడదాయే ॥హరిహరి॥

తెలివి తప్పట, తెలివి వచ్చుట తీరుతీరులాయే ॥హరిహరి॥

నిద్రతగ్గె - నాడీ చలనాలే నిలిచి నిలిచి సాగే ॥హరిహరి॥

శ్వాసక్రమముగా స్తంభనమొందె - ఏదిదారి మనకూ ॥హరిహరి॥

అనుచు ఆంధ్రులూ అరవలందరూ హాహా కారముతో ॥హరిహరి॥

ఆక్రోశించిరి పట్టరాని శోకాగ్ని కాల్చి వేయా ॥హరిహరి॥

వంత : అయ్యో . . . . . , తందానా దేవ వందనానా !

కథ : అయ్యో - కదలి పోయె శ్రీరాములు దేహము కఠిన దీక్ష నిలిచీ

వంత : హరిహరి!

కథ : లేచిపోయె శ్రీరాములు ప్రాణము హంసపోలె ఎటకో - ॥హరిహరి॥

తరలిపోయె శ్రీరాములు తేజము ధరణి విడిచి పెట్టీ ॥హరిహరి॥

నిలిచి పోయె శ్రీరాములు నవ్వులు నిత్యనిరంతముగా ॥హరిహరి॥

వంత : అయ్యో . . . . . , తందానా దేవ వందనానా !

॥తందానతాన॥

తందానా తందాన తందనా తానె తందనానా ॥తందానతాన॥

తా - తకిటతరి - తరికిట ఝుంతరి - తా



కథ : అరెరే - ధన్యమైనదీ ఆంధ్రజగతి శ్రీరాములు దయచేతా
వంత : భళాభళి
కథ : ధన్యమైనదీ కన్నకడుపు శ్రీరాములు జన్మించా ॥భళాభళి॥
అరెరే - పరులకోసమే మేనుదాల్చె శ్రీరాములు కడవరకూ ॥భళాభళి॥
అరెరే - పరులకోసమే శ్వాసతీసె శ్రీరాములు కడవరకూ ॥భళాభళి॥
అరెరే - పరులకోసమే శ్వాసవిడిచె శ్రీరాములయ్యొ తుదకూ ॥భళాభళి॥
అరెరే - పరులకోసమే మేను విడిచె శ్రీరాములయ్యొ కడకూ ॥భళాభళి॥
అరెరే - ధన్యము ధన్యము ఆంధ్రరాష్ట్రమా ధన్యజీవి వలన ॥భళాభళి॥
అరెరే - ధన్యము ధన్యము ఆంధ్ర దేశమ్మా అమరజీవి వలన ॥భళాభళి॥
కథ : వినరా ఆంధ్రకుమారా ! ధీరా ! అమరజీవి గాథా !
వంత : తందానతాన
కథ : కనరా ఆంధ్రకుమారా ! ధీరా ! శ్రీరాములుగాథా ! ॥తం॥
వినరా ఆంధ్రకుమారా ! ధీరా ! అమరజీవిగాథా ! ॥తం॥
అరెరే - ఆత్మార్పణతో ఆంధ్రరాష్ట్రమును నిలిపెను మహరాజు ॥తం॥
అరెరే - ఆత్మాహుతితో ఆంధ్రభాషనే కొలిచెను మహరాజు ॥తం॥
అరెరే - అసువులు పోసి ఆంధ్రులందరిని సాకెను మహరాజు ॥తం॥
వంత : తందానా . . . . , తందానా . . . . , తానె తందానానా ! ॥తం॥
తందానతందాన తందనా తానె తందనానా ! ॥తం॥
తా - తకిటతరి - తరికిఝుంతరి - తా



త్యాగపూర్ణజీవి అమరజీవి ఆత్మాహుతితో అఖిలదేశం కదలిపోయింది. ఆయన ఆశయాల పంటగా ఆంధ్రప్రదేశ్ భాషా ప్రయుక్త రాష్ట్రం క్రీ . శ . 1956 నవంబర్ 1 శుభదినాన అవతరించింది.

పల్లవి: మంచికోసం జీవితాలను పంచి ఇచ్చిన నాయకులలో
అగ్రగామివి అమరజీవీ! ఆంధ్రరాష్ట్రాభ్యుదయ తీవీ! ॥మంచి॥

1. పేరులోపల పొట్టి ఉన్నా - ప్రేమ గుణమున దిట్టనీవు
రాష్ట్ర జనులకు రామ రక్షగ రాణకెక్కగ పుట్టినావు
వంచనలకే నిలయమైన పరిస్థితుల పరిమార్చినావు
దీక్షలో నీ సాటినీవై దివిజలోకము మెట్టినావు ॥మంచి॥

2. ఎన్ని జన్మల తెలుగు రక్తము ఉన్నదో నీ మేనిలోపల
ఒరులు చేయని రీతిలో ఊపిరులు దానము చేసినావు
దేశ భాషకు ప్రాణమిడి ప్రత్యేక రాష్ట్రము వెలయజేసిన
మహితమూర్తీ ! అమరజీవీ! మామనస్సుల చిరంజీవీ!
॥మంచి॥

3. ధన్యమైనది మాతృగర్భము - ధన్యమైనది ఆంధ్రరాష్ట్రము
ధన్యమైనది నీవు మసలిన ధరణిలో అణువణువు సైతము
జాతి చెర తొలగించినట్టి ప్రహేతిగాంధీజీకి సాటిగ
భరతకీర్తిని వెలుగజేసిన భవ్యమూర్తీ! అమరజీవీ! ॥మంచి॥

॥మంచి॥

★ ★ ★